

శ్రీః

శ్రీ విద్యానందనాథ విరచిత

# కైవల్యనవనీతము

(టీకాతాత్పర్యసహితము)



ప్రకాశకులు

శ్రీ సదాశివ బ్రహ్మేంద్రాశ్రమము, చిల్లకల్లు-521 178

శ్రీః

శ్రీ విద్యానందనాథ విరచిత

# కైవల్యనవనీతము

**(టీకాతాత్పర్యసహితము)**


| | |
|---|---|
| **పేజీలు** | : **496** |
| వెల | : **రూ. 200/-లు** |
| **ఆవిష్కరణ** | : **12-02-2010 మహాశివరాత్రి** |



© **R. MOHAN RAO,**
4-103, ILTD Colony Extn.,
Kothapet,
**CHIRALA** - 523 157,
Phone : **9440115411**



**D.T.P. :**
***VIKRAM GRAPHICS, CHIRALA***
**Cell : 9492080750**

**Printed at:**
***KARSHAK ART PRINTERS***
***HYDERABAD.***







శ్రీవిద్యానందనాథమునికృతమైన 'కైవల్యనవనీతము' రెండు ప్రకరణముల వేదాంత, యోగశాస్త్రగ్రంథము. ఈ తెలుగు ప్రబంధము స్వీయటీకతో 1882లో వెలువరింపబడినది. మొదటిదగు తత్త్వబోధ ప్రకరణమున తురీయపురుషార్థమగు 'మోక్ష' పథము సుగమము చేయబడినది. సాధకులు సాధించవలసిన సమస్త వస్తుసామాగ్రి పొందుపరుచబడినది. రెండవదియగు సందేహనివారణ ప్రకరణమున సాధకునికి సాధనలో కలుగు సర్వసందేహములకు నివృత్తి ప్రదర్శితమయినది.

ఈ గ్రంథ శిథిలప్రతిని గాంచి పునర్ముద్రించిన సాధకులకుపయోగమని భావించిన శ్రీ నడిపినేని సూర్యనారాయణ మఱియు వారి ధర్మపత్ని శ్రీమతి కోటేశ్వరమ్మగార్లు, ఆర్థికసాహాయ్యమందించుటతోబాటు, ఇద్దానిని వారి గురువులు కవివంశజులు అగు శ్రీ కనుపర్తి అప్పయ్యగారికి సమర్పించుట కడు శ్లాఘనీయము. ఇయ్యది శ్రీశ్రీశ్రీ అరుణానందసరస్వతిస్వామివారి శుభాశీస్సులతో శ్రీ సదాశివ బ్రహ్మేంద్రాశ్రమము, చిల్లకల్లువారి తరఫున వెలువరించుట ముదావహము.

శ్రీ స్వామివారి భక్తులకు ఇదివొక యమూల్య కానుక. ఆశ్రమమున శ్రీ స్వామివారి దర్శనప్రసాదముగ పొందదగును.

మోక్షగాములైన వో సాధకశ్రేష్ఠులారా! ఇద్దానిని అధ్యయనాధ్యాపనములు గావించి పరిణితి చెందుదురుగాక!

'ఎందఱో మహానుభావులు-అందఱికీ వందనాలు'

వాడరేవు, సంపాదకుడు
ది. 28-12-2009. 'రామోరా'

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః

# కైవల్యనవనీతము

తత్త్వబోధప్రకరణము

## విషయసూచిక

**పద్యసంఖ్య**

46. పూర్వకాలపు జ్ఞానులకువలె నిప్పటిజ్ఞానుల కణిమాదులేల లేవు? అని యడుగుట.
47. వీరి కణిమాదులు లేకపోవుటకుఁ గారణమును, వాని ప్రయోజనములను దెల్పుట.
48. అణిమాదిసిద్ధులు ప్రత్యగభిన్నబ్రహ్మైక్యమునకు ఆవశ్యకములు గావని తెలుపుట.
49. యోగజ్ఞానము ముక్తినిచ్చుచుండఁగా వ్రతాదులేల యనుటకు సమాధానము.
50. శిష్యుఁడు సంశయరహితుఁడై ఆచార్యులను స్తుతించుట.
51. వేదము ప్రారబ్ధకర్మము అనుభవించిన నేతీరుననియు, జ్ఞానాగ్నిచేత చెడుననియు ద్వివిధముగాఁ బలుకుటకు గారణమేమనుట.
52. వేదము కర్మ భక్తి జ్ఞానములనెడి త్రికాండములచే పూర్వపక్షసిద్ధాంతములను బలుకునని దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుట.
53. వ్రతాదులను గుఱించియు, జ్ఞానమును గుఱించియు వేదమందుఁ జెప్పఁబడిన ఇరుతెఱఁగులయొక్క సందేహమును నివారించుట.
54. జ్ఞానమొక్కటే అనేక జన్మసంచితాగామి ప్రారబ్ధములను దహించుచుండగా కర్మకాండములోఁబడి మునుఁగుచున్నారేలయని యడుగుట.
55. జ్ఞానులగూర్చియు, కర్మఠులగూర్చియు జెప్పుట.
56. ద్వంద్వములు ఈశ్వరుఁడు కలుగఁజేయుననియే గాని జీవులు కల్పించుకొనుటకు శక్తులౌదురాయని శిష్యుఁడడుగఁగా సమాధానము.
57. శిష్యుఁడడిగిన ఈశ్వరజీవవ్యవహారముల తారతమ్యములను దెలియఁజేయుట.
58. జీవేశ్వరకార్యములు నశించుటవలనఁ గలిగెడి ప్రయోజనములఁ దెల్పుట.
59. జీవేశ్వరకార్యముల వివరణమును ఈశ్వరకృత్యములయందు జీవకృత్యములు లయించుటచే కలిగెడి ఫలమును దెలుపుట.
60. జీవేశ్వరుల స్వరూపములను దృష్టాంతపూర్వకముగా నిరూపించుట.
61. జీవేశ్వరకృత్యముల నెఱిఁగి బ్రహ్మనిష్ఠఁజేయువారు పొందెటి ప్రయోజనము.
62. ఈశ్వరునియందు సమత్వమును జూపుట.
63. ఈశ్వరుఁడు ప్రయత్నముచేయని వారిని రక్షింపఁడని తెలుపుట.
64. ముక్తిహేతువగు శ్రుతిమార్గమును మఱువరాదని బోధించుట.
65. జ్ఞానోత్పత్తి కలుగు విధమును జెప్పుట.
66. విచారమే జ్ఞానోత్పత్తికి కారణమని తెలుపుట.
67. పుణ్యకార్యములే అన్నింటి నిచ్చుచుండగా విచారమేలయని యడుగుట.
68,69. సత్కర్మలకును విచారమునకును గల భేదమును దృష్టంతముతోఁ దెలుపుట.



116. సమాధినుండి బహిర్ముఖుఁడైన శిష్యుని స్వరూపమును చెప్పుట.
117. శిష్యుఁడు ఆచార్యునకు తన యభిప్రాయమును తెలుపుట.
118. సమాధిభంగకరములగు విఘ్నత్రయమును చెప్పి వానిని తొలఁగించుకొనవలయు నని ఆచార్యుఁడు తెలుపుట.
119–121. విఘ్నము లే విధముగా హానిని కలుగఁజేయుననియు, వాని పేరులు, అవి నశించురీతి తెలుపవలయుననియు శిష్యుఁడడుగుట.
122. అసంభావన, సంశయభావన, విపరీతభావనలు నశించురీతి చెప్పుట.
123. షల్లింగవిచారము.
124. త్రిపుటులవివరణము.
125. బ్రహ్మవిదాదుల తారతమ్యమును చెప్పుట.
126. బ్రహ్మవిదాదుల మనోవృత్తి భేదవివరణము.
127. **బ్రహ్మవిదుని లక్షణము.**
128. బ్రహ్మవేత్తల ప్రవర్తనావిశేషమును తెలుపుట, ఇచ్ఛాప్రారబ్ధ, అనిచ్ఛాప్రారబ్ధ, పరేచ్ఛా–ప్రారబ్ధముల వివరణము.
129. ఆగామి సంచిత ప్రారబ్ధముల వివరణము.
130. **బ్రహ్మవిద్వర, విద్వరీయ, విద్వరిష్ఠుల లక్షణము.**
131. బ్రహ్మవిద్వరాదులఫలితస్థితి.
132. బ్రహ్మవేత్తల విలక్షణమయిన స్థితి.
133. బ్రహ్మవిద్వరాదులను చూచువారికి కలుగుఫలమును, ఆ బ్రహ్మవిద్వరాదులు పొందు ముక్తిసుఖమును చెప్పుట.
134. ఆగామి సంచిత ప్రారబ్ధకర్మ విమోచనమును తెలుపుట.
135. పుణ్యకర్మము ఉత్తమజన్మములకును, పాపకర్మము అధమజన్మములకును, మిశ్రకర్మములు మధ్యమజన్మములకును కారణములు కావున జన్మరహితులగు విదేహముక్తుల యం దాకర్మములు తొలఁగునని సకారణముగ చెప్పుట.
136. శరీరత్రయవిమోచనమును చెప్పుట.
137. విదేహముక్తిలక్షణము.
138. విదేహముక్త్యనుభవ మెల్లప్పుడును ఒక్కతీరున ఉండునా యని శిష్యుఁడడుగ ఆచార్యుఁడు సదృష్టాంతముగ తెలుపుట.
139. సదసత్తులను తెలుపుట.
140. శ్రీ శివకామసుందరీస్తోత్రము.
141. మౌనత్రయవివరణము.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః

# కైవల్యనవనీతము

సందేహనివారణప్రకరణము

## విషయసూచిక

**పద్యసంఖ్య**

162. చతుర్విధసన్న్యాసుల నామములను లక్షణములను జెప్పుట.
163. సన్న్యాసమునకు హేతువులైన త్రివిధవైరాగ్యములను సలక్షణముగఁ దెలుపుట.
164. తీవ్రవిరాగమందలి ద్వివిధభేదములను జెప్పుట.
165. తీవ్రవైరాగ్యమందలి సన్న్యాసుల భేదములను సప్రయోజనముగఁ జెప్పుట.
166. తీవ్రతరమందలి పరమహంసల యభ్యాసానుభవములయందుఁగల భేదములు.
167. జిజ్ఞాసులు ఇరుతెఱఁగులనుందురని చెప్పుట.
168. ప్రజ్ఞానఘనమందలి ఫలితార్థమును దెలుపుట.
169. కూటస్థుఁడే పరబ్రహ్మమని చెప్పుట.
170. విద్యానందమందలి జీవేశ్వరైకమత్యమును ప్రమాణములతోఁ దెలుపుట.
171. విద్యానందమేకమైనను స్వానుభూతి ఏ ప్రకారమనుటకు సమాధానము.
172. అఖండబ్రహ్మజ్ఞానము కలుగుటకు స్వానుభవమును వక్కాణించుట.
173. మనోవృత్తిని వదలుటకు త్రివిధోపాయముల యనుభవములు దెలుపుట.
174. త్రివిధోపాయములలో సాధకములైన రెండు మార్గములను దెలుపుట.
175. అవిద్యను బోఁగొట్టునుపాయమెట్లను ప్రశ్నకు సమాధానము.
176. సర్వము బ్రహ్మమయమను జ్ఞానముదయించుటకు అనుభవమును జెప్పుట.
177. అఖండమైన బ్రహ్మము తానేయని స్థిరపఱుచుట.
178, 179. గురుకటాక్షముచేతఁ బొందిన సహజానందమును శిష్యుఁడు చెప్పుట.
180, 181. గ్రంథకర్త తన తండ్రులను, గురువును స్తుతించుట.
182. ఈ గ్రంథాభ్యాసకులు చెందెడి మహాతిశయమును వర్ణించుట.
183, 184. ఈ రెండుపద్యములచేత శ్రీ శివకామసుందరీదేవికి నమస్కరించుట.
185. తత్త్వమసియను మహావాక్యముచే సంపూర్ణులగు వా రిట్టివారనుట.
186. గ్రంథకర్త తనదేశికుని సేవించువారికిఁ గలిగెడి ప్రయోజనమును దెలుపుట.
187. కైవల్యనవనీతమందలి రెండు ప్రకరణముల ఫలమును త్రిపుటి ప్రమాణములచే దెల్పుట.
188. గ్రంథకర్త తన యాచార్యులవలనఁ గలిగిన యానందసంపదను గొనియాడుట.
189-191. గ్రంథశ్రవణఫలము.

కైవల్యనవనీతోత్తరభాగ (సందేహనివారణప్రకరణ) విషయసూచి సంపూర్ణము.





70. అజ్ఞానమును పోఁగొట్టుటకు సత్కర్మములుండగా జ్ఞానము చేనేమి?
71. అజ్ఞానమును నశింపఁజేయ జ్ఞానమే ముఖ్యమని నిరూపించుట.
72. పరమాత్మయందుఁ దోఁచెడి అనృతజడదుఃఖములఁ బోఁగొట్ట జ్ఞానమేచాలును.
73. విచారణచేత జడభావమైన యజ్ఞానము నశించునని దృష్టాంతముతోఁ జెప్పుట.
74. వేదము బ్రహ్మజ్ఞానమును శ్లాఘించి మఱల కులాశ్రమ ధర్మమే సంతోషమును కలుగఁజేయునని చెప్పుటకుఁ గారణమును శిష్యుఁడడుగుట.
75. వేదము ముందుగా కర్మకాండమును జెప్పుటకు దృష్టాంతముతోఁ జెప్పుట.
76,77. భోగాసక్తుల లక్షణములు, వేదముయొక్క ముఖ్యాభిప్రాయము.
78. విధినిషేధముల విశదీకరించి సర్వసంగపరిత్యాగులను శ్లాఘించుట.
79. అజ్ఞానము, జ్ఞానము ఒకటిగాఁ గూడి ప్రపంచసృష్టి నెట్లు చేయుననుట.
80. స్వరూపజ్ఞాన, వృత్తిజ్ఞానములను విభజించి చెప్పుట.
81. స్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమై అజ్ఞానమును దహించునని చెప్పుట.
82. అంతఃకరణోద్భవములైన సత్కర్మములు వృత్తిజ్ఞానము అనువానిలో వృత్తిజ్ఞానమును పూర్ణజ్ఞానమనుటకుఁ గారణమేమని శిష్యుఁడడుగుట.
83. జ్ఞానాజ్ఞానములకు విరోధము కలుగుటకుఁ గారణమును దెలుపుట.
84. జ్ఞానమును కర్మములను వివరించి నిరూపించుట.
85. యోగజ్ఞానముల తారతమ్యములఁ దెలియఁజెప్పుట.
86. శ్రవణము చేసి యొనర్చెడి ధ్యానమునకును, అపరోక్ష సాక్షాత్కార జ్ఞానమునకును గల భేదమును బ్రహ్మస్వరూపనిరూపణమును విశదీకరించుట.
87. వారివారి జన్మములకుఁ గారణములను తాదాత్మ్యత్రయమును జెప్పుట.
88. పరోక్షజ్ఞానముచే అపరోక్షజ్ఞానము కలుగువిధమును దెలుపుట.
89. వృత్తిజ్ఞానము అజ్ఞానమును నాశనము చేయురీతిని దృష్టాంతముతోఁ దెలుపుట.
90,91. అపరోక్షజ్ఞానులు నిర్వికల్పనిష్ఠయందుండు విధమును జెప్పుట.
92. జగమంతయు మిథ్యయని దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుట.
93. బ్రహ్మ మొదలగు సర్వము మాయాకార్య మనదగునా యని శిష్యుఁడడుగుట.
94. స్వప్నదృష్టాంతముచేత సమస్తమును మాయాకార్యమేయని తెలుపుట.
95. సదసత్తుల నిర్ణయమును దృష్టాంతపూర్వకముగాఁ దెలుపుట.
96-100. మాయను గుఱించి శిష్యుఁడడిగెడి యాఱు ప్రశ్నలు, తత్సమాధానములు.
101. అసద్రూపమైన మాయాశక్తియొక్క రూపమును దృష్టాంతపూర్వకముగాఁ దెలిపి

దేశకాల వస్తువులచేత పరబ్రహ్మమునకు అపరిచ్ఛిన్నత్వమును ప్రతిపాదించుట.
102. పరబ్రహ్మమందలి చిచ్ఛక్తియే ఆకాశాదికముగా పరిణమించినదనుట.
103. మిథ్యారూపమగు చిదాభాసశక్తికార్యములు పరబ్రహ్మమునకు వేఱగునా లేక ఒక్కటియే యగునాయని శిష్యుఁడు మూఁడువిధముల ప్రశ్న చేయుట.
104. చిచ్ఛక్తి కార్యములగుఱించిన మొదటి రెండు ప్రశ్నలకు సమాధానము.
105. బ్రహ్మమునకు మాయాశక్తి భిన్నాభిన్నమనెడు ప్రశ్నకు సమాధానము.
106. మాయాశక్తి యణఁగినను తత్ కార్యములణఁగమిని గూర్చి సంశయనివృత్తి జేయుట.
107. మాయాకార్యమగు జగద్విచారము నిష్ప్రయోజనమని నిరూపించుట.
108. బహిర్ముఖదృష్టి వదలి అంతర్ముఖదృష్టిని గైకొనువిధమును దెలుపుట.
109. సచ్చిల్లక్షణములు గోచరమగునట్లానంద లక్షణము వెలుపలఁదోఁచకుండుట.
110–112. సచ్చిదానందములు వేర్వేఱుగాఁ దోఁచుటకుఁ గారణము.
113. శిష్యుఁడడిగెడి బ్రహ్మలక్షణములను ప్రమాణదృష్టాంతములతోఁ జెప్పుట.
114. సచ్చిదానందలక్షణములను స్పష్టముగాఁ దెలుపుఁడని శిష్యుఁడడుగుట.
115. ఆత్మ సద్రూపుఁడనుటకు అనుభవమును దెలుపుటయు, కాయికాది త్రివిధకరణముల యందలి నవవిధభేదముల వివరణమును దెలుపుటయును.
116. చిదానందరూపముల రెంటిని విశదీకరించుట.
117. ఇహలోకసుఖమునకు భోజనద్రవ్యాదులు కారణమైనట్లు ఆనందస్వరూపుఁడైన పరమాత్మ కే కారణమును లేదని నిరూపించుట.
118. పరోక్షముగా ననుభవించెడి యానందము బ్రహ్మానందము కానేరదని తెలుపుట.
119. ఆనందస్వరూపమగు ఆత్మయందు అసూయలేదనుటకు అనుభవము చెప్పుట.
120. ఆత్మ చిద్రూపుఁడు ఆనందస్వరూపుఁడుననుటకు ననుభవము జెప్పుట.
121. గౌణమిథ్యాకర్త్రాత్మల వివరణము.
122. గౌణాది ఆత్మలను విడిచిన ఆనందమే ఆత్మస్వరూపమని చెప్పుట.
123. నిరతిశయానంద స్వరూపాత్మ అనుభవమగుటకు ముఖ్యమైన త్రివిధానందములు.
124. త్రివిధానందములలో అంతర్భూతములైన అష్టవిధానంద భేదముల వివరము.
125. విషయానందలక్షణమును, అష్టవిధానందముల వివరణ.
126, 127. బ్రహ్మానందమును, త్రిపుటులవివరణమును విమర్శించుట.
128. నిద్రయందు ప్రాప్తించిన బ్రహ్మానందము నాకెట్లు నిదర్శనమగునని యడుగుట.
129. సుషుప్తియందుఁ గలిగిన బ్రహ్మానందమును దృష్టాంతముతో బోధపఱచుట.



130–132. వాసనానంద, నిజానంద, ముఖ్యానందలక్షణములను విశదీకరించుట.
133. ఆనందముయొక్క మాహాత్మ్యమును శ్రుతిసమ్మతముగాఁ జెప్పుట.
134. శ్రుతిసమ్మతముగాఁ జెప్పిన బ్రహ్మానందమును అతీతముగాఁ గొనియాడుటయు సప్తభూమికావివరణమును సంగ్రహముగాఁ దెలుపుట.
135. బ్రహ్మలక్షణత్రయమును సలక్షణముగాఁ దెలిపిన పిదప శిష్యునకు సందేహమేమైన కలదాయని ఆచార్యులడుగుట.
136. సత్, చిత్, ఆనందశబ్దములు ఐక్యమయ్యెడిరీతిని శిష్యుఁడడుగుట.
137. సచ్చిదానందపదార్థముల ప్రారంభకారణాదికమును దెలుపుట.
138–141. సచ్చిదానందైక్యము స్థిరపడుటనుగుఱించి వేదమొకటిగాఁ జెప్పిన ప్రియములైన నామములలో విధినామములను నిషేధనామములను జెప్పుట.
142. విధినిషేధనామములయొక్క తాత్పర్యైకమత్యమును దెలుపుట.
143. నిర్గుణుఁడైన పరబ్రహ్మమునకు ప్రకృతిజన్యములైన గుణములతోఁ గూడిన నామములను జెప్పవచ్చునా యనెడు ప్రశ్నకు సమాధానము జెప్పుట.
144. సచ్చిదానందతాత్పర్యము లొకటేయని శ్రుతి చూపించునట్లు బుద్ధియందు కనఁ బఱుపవలయునని శిష్యుఁడడుగుట.
145–146. సచ్చిదానందతాత్పర్యము లొక్కటియేయని రూఢిపఱచుట.
147. సచ్చిదానందముల మూఁటికిని అర్థమొక్కటేయని అనుభవమును దెలుపుట.
148. శ్రుతియుక్త్యనుభవ ప్రకారము శిష్యుఁడు సహజనిష్ఠను పొందుటను జెప్పుట.
149–152. జ్ఞాన, అజ్ఞాన, సప్తవిధ భూమికలను దెల్పుమని శిష్యుఁడడుగుట.
153–155. జ్ఞానభూముల నేడింటిని తల్లక్షణములను జెప్పుట.
156. సప్తభూమికలను ఐదవస్థలుగా భాగించుటను తుర్యాతీతలక్షణమును జెప్పుట.
157. తుర్యాతీతమనుదానికి అనుభవమును జెప్పుట.
158. జ్ఞానభూములేడింటిలో మొదటి మూఁడుభూములను అభ్యసించుటచేఁ గలిగెడి ప్రయోజనమును మొదటి భూమిక లభించుటవలనఁ గలిగెడి అతిశయమును చెప్పుట.
160. మొదటి మూఁడుభూములలో దేనిఁబొందినను ముక్తి గలదు.
161. ముక్తిని బొందుటకు వర్ణాశ్రమభేదము లక్కఱలేదనియుండఁగా జ్ఞానభూమికల యొక్క కడపటిదైన తుర్యాతీతము సన్న్యాసులకే గాని యితరులకు లభించదని చెప్పుటవలనఁ గలిగెడి సందేహమును బోఁగొట్టవలయునని శిష్యుఁడడుగుట.

డు అని, జీవునకు విశ్వుఁడు వ్యావహారికుఁడు చిదాభాసుఁడు అని, బ్రహ్మవేత్తకు ఓతయని పేళ్ళగును.

**1.** జాగ్రత్తలో జాగ్రత్త– ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు జాగ్రత్తలో జాగ్రత్త వచ్చునప్పుడు అకారములో అకారమును, అవిద్యాపాదములో అవిద్యాపాదమును స్థూలదేహమునందు స్థూలదేహము తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో విరాట్టు, జీవునకు విశ్వునిలో విశ్వుఁడు, బ్రహ్మవేత్తకు ఓత్రోత అని నామములు కలుగును.

జాగ్రత్తలో స్వప్నము–పై ముప్వురకును జాగ్రత్తలో స్వప్నము వచ్చునపుడు అకారములో ఉకారమును అవిద్యాపాదములో విద్యాపాదమును స్థూలశరీరమునందు సూక్ష్మశరీరమును తారతమ్యములు. అపుడు ఈశ్వరునకు విరాట్టులో హిరణ్యగర్భుఁడని, జీవునకు విశ్వునిలో తైజసుఁడని, బ్రహ్మవేత్తకు ఓత్రనుజ్ఞాత యని పేళ్ళు గలుగును.

జాగ్రత్తలో సుషుప్తి– పైముప్వురకును జాగ్రత్తలో సుషుప్తి వచ్చునపుడు అకారములో మకారమును, అవిద్యాపాదములో ఆనందపాదమును, స్థూలశరీరమునందు కారణశరీరమును తారతమ్యములుగఁగలుగును. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో హిరణ్యగర్భుఁడని, జీవునకు విశ్వునిలో ప్రాజ్ఞుఁడని, బ్రహ్మవేత్తకు ఓత్రనుజ్ఞైకరసుఁడని నామములు గలుగును.

జాగ్రత్తలో తురీయము– ఆ ముప్వురికిని జాగ్రత్తలో తురీయము వచ్చునపుడు అకారములో అర్ధమాత్రయును, అవిద్యాపాదములో తురీయపాదమును, స్థూలశరీరము నందు మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో పరమాత్మయని, జీవునకు విశ్వునిలో కూటస్థుఁడని, బ్రహ్మవేత్తకు ఓత్రవికల్పుఁడని పేళ్ళు గలుగును.

**2.** స్వప్నము– సమష్టిరూపుఁడైన యీశ్వరునకు వ్యష్టిరూపుఁడైన యీశ్వరునకును వ్యష్టిరూపుఁడైన జీవునకును సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును స్వప్నావస్థయందు ఉకారమును, విద్యాపాదమును సూక్ష్మదేహమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు హిరణ్యగర్భుఁడు సూత్రాత్మయను పేళ్ళును, జీవునకు తైజసుఁడు స్వప్నకలితుఁడు అను పేళ్ళును బ్రహ్మవేత్తకు అనుజ్ఞాత యనుపేరును గలుగును.

1. స్వప్నములో జాగ్రత్త–ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు స్వప్నములో జాగ్రత్త వచ్చినపుడు ఉకారములో అకారమును విద్యాపాదములో అవిద్యాపాదమును సూక్ష్మదేహమందు స్థూలదేహమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు హిరణ్యగర్భునిలో విరాట్టనియును, జీవునకు తైజసునిలో విశ్వఁడనియును, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాత్రోతయను పేరును గలుగును.

2. స్వప్నములో స్వప్నము– మఱియు నీముప్వురకును స్వప్నములో స్వప్నము

శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః

# కైవల్యనవనీతము-టీకాతాత్పర్యసహితము

# తత్త్వబోధప్రకరణము

**అవ :–** కైవల్యనవనీతమనెడు సకలోపనిషత్సారమైన యీ యద్వైతశాస్త్రమంతయు నిత్యమంగళస్వరూపమైనను "**సమాప్తి కామో మంగళమాచరేత, విఘ్నధ్వంసకామో మంగళ మాచరేత**" అను శిష్టాచారమునుబట్టి ఆస్తికమతావలంబనులగు జనులకు "**అస్మద్గురుభి ర్మంగళమాచరితమ్, అస్మాభిరపి మంగళమాచరితవ్యమ్**" అను ప్రమాణములు తెలియుటకై "**శ్లో. ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మా న్మాఙ్గళికా వుభౌ**" అను స్మృతినిబట్టి యీగ్రంథాదిని ప్రణవాకారపరబ్రహ్మము **శ్రీకైవల్యఖదైకపా** త్తనుపద్యముచేత స్తుతింపఁబడుచున్నది.

శా॥ **శ్రీకైవల్యఖదైకపాత్త్రిపదలక్ష్మీసంయుతోద్గీథస–**
**ల్లోకాలోకకలైకమత్యపరమాలోకాత్మమై యెద్ది య–**
**స్తోకానందముఖాంకపంచకలనా సువ్యక్తమై యొప్పు నా**
**శ్రీకైవల్యనవోద్ధృతార్థము సదా సేవించి కీర్తించెదన్.** **1**

**టీక:–** ఎద్ది=ఏప్రణవాకారపరబ్రహ్మము, శ్రీకైవల్య...కాత్మమై, శ్రీ=ధర్మార్థకామము లనెడి త్రివర్గముయొక్కయు, కైవల్య=మోక్షముయొక్కయు, ఖ=సుఖములను, ద=ఇచ్చునట్టి, ఏకపాత్=(పాదోఽస్య విశ్వాభూతాని) అను శ్రుతిచేత ఒక్కటియై ఆకారాత్మకమైన అవిద్యాపాదముయొక్కయు, త్రిపద=(త్రిపాదస్యామృతం దివి) అనుశ్రుతిచేత మూఁడైన ఉకారమకారార్ధమాత్రస్వరూపములైన విద్యాపాదానంద పాదతురీయపాదములయొక్కయు, లక్ష్మీ=సంపదలతోడ, సంయుత=కూడిన, ఉద్గీథ=బ్రహ్మప్రణవమందలి, సత్=శ్రేష్ఠములైన, లోకాలోకకలా=ప్రకృతిమయములగు పదునైదుకలలయొక్కయు, ఐకమత్య=మేళనముచేత,

పరమ=సర్వోత్కృష్టమై, ఆలోక=వెలుఁగుటయే, ఆత్మమై=స్వరూపముగాఁ గలదై, అస్తో....క్తమై, అస్తోక=మిక్కుటమైన, ఆనందముఖ=నిజానందమే మొదలగు, అంకపంచ= గుణుతులైదింటియొక్క, అనఁగా పంచలక్షణములయొక్క, కలనా=కూడికచేత, సువ్యక్తమై= లెస్సగాఁదెలియఁబడునదియై, ఒప్పు....అర్థముꣳ, ఒప్పు=మనోహరమగుచున్న, ఆ= ప్రసిద్ధమైన, శ్రీ=సూర్యచంద్రానల కాంతుల మీఱి మెఱయుచున్న, కైవల్యనవోద్ధృత= కైవల్యనవనీత మనెడి ఈ యోగశాస్త్ర మందలి, అర్థముꣳ=విషయమును, అనఁగా ప్రణవమయమైన పరబ్రహ్మమును, సదా=ఎల్లప్పుడును, సేవించి=భజించి, కీర్తింతెదꣳ= పొగడెదను.

**తాత్పర్యము:–** ధర్మార్థకామమోక్ష ప్రదములగు అకార ఉకార మకారార్ధమాత్రస్వరూపములైన అవిద్యాపాదము విద్యాపాదము ఆనందపాదము, తురీయపాదము అనెడి నాలుగు పాదములుగల బ్రహ్మప్రణవమందలి పదియాఱవభాగమైన అవికల్పావికల్పకలా స్వరూపమై సచ్చిదానందనిర్మలాఖండములనెడి పంచలక్షణములచేత వెలుఁగుచున్నదై కైవల్యనవనీత మనెడి యీ యోగశాస్త్రమందలి ముఖ్యతాత్పర్యమై యొప్పు పరబ్రహ్మమును ఈ శాస్త్రనిర్విఘ్నపరిసమాప్త్యర్థమై యెల్లప్పుడును సేవించి వినుతించుచున్నాననుట.

శార్దూలవృత్తలక్షణము. శా. సారాచారవిశారదా యినయతిꣳ శార్దూలవిక్రీడితా। కారంబై మసజమ్ము లిమ్ముగ సతాగప్రాప్తిచేఁ జెల్వగుꣳ ॥తా॥ మ–స–జ–స–త–త–గ– గణములును–13వ అక్షరము యతి, శార్దూలవృత్తమునకు నుండవలయుననుట ॥క॥కృతిముఖమున దైవనమ। స్కృతి యొండె నభీష్టవస్తుకీర్తన మొండెꣳ। వితతాశీఃపద మొండెను। బ్రతిపాదింపంగవలయు భద్రాపేక్షꣳ॥ అను లక్షణముచేత నిష్టదేవతాకీర్తనారూప మంగళ మీపద్యమున జెప్పఁబడెను ॥క॥ మయరసతజభనలకుభూ। పయోగ్యనిలగగన భాను పద్మారివృషా। హ్వాయి లీశులు శివజయలయ। భయబలరుగ్ధనముదములు ఫలములు వరుసꣳ॥ అని యున్నందున గ్రంథాదిని **మగణ ప్రయోగము॥ శ్రీకారప్రభావము॥ తే॥** వేదముల కెల్ల మొంకార మాదియైన। కరణిఁగృతులకు నెల్ల శ్రీకారమాది। గానఁ గవివరు లెల్లను దానిఁ దక్కనితరవర్ణంబు లిడరు సత్కృతులమొదల॥ క॥ పదపడి శ్రీకారము కృతి। మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం। బొదవించుఁ బరుస మినుమును। గదిసి సువర్ణంబు సేయు కరణి ధ్ధరణిꣳ॥క॥ శుభదేవతాత్రయంబును। శుభఖచరత్రయము గలిగి శుభవాచకమై। యభినుతి గాంచిన కతమున। శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే॥ తా॥ శవర్ణ రేఫేకారములు గూడి **శ్రీ** యయ్యెను. అందు శవర్ణేకారములకు అధిదేవత లక్ష్మీదేవి. రేఫమున కగ్నిదేవుఁడు, "**శ్రియమిచ్ఛేద్ధుతాశనా**" త్తని పురాణవచనము గలుగుటంజేసి యతఁడును లక్ష్మీప్రదుండు గాన మూఁడువర్ణములకును శుభదేవతలైరి. మొదలిశవర్ణమునకు గ్రహము గురుఁడు. రేఫమునకు నీకారమునకు శుక్రుఁడొక్కఁడే



కాన మూఁటికిని శుభగ్రహములే యయ్యెను. "**కమలాశ్రీర్హరిప్రియా**" యని లక్ష్మీనామము. గావున శుభవాచకమయినది. కానఁగృతిముఖమందుఁ బ్రయోగించిన శ్రీకారమువలన శుభము గలుగుట చిత్రముగాదు గనుక నీగ్రంథాదిని శ్రీకారము ప్రయోగింపఁబడెను. ఇట్లని యప్పకవీయమందున్నది.

మఱియు, ఈ పద్యపు రెండవపాదమున "లోకాలోకకలైకమత్యపరమా" యని చెప్పుటచేత లోకకలలు పదియైదును, అలోకకల యొక్కటియును గూడి పదియాఱు కలలయ్యెను. కల యనఁగా ఒకటిలో పదియాఱవభాగము గనుక బ్రహ్మప్రణవము పదియాఱు భాగములు గలది. అది యెట్లులనిన "**శ్రు॥ అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్। ఓమిత్యేవం న జానాతి బ్రాహ్మణో న భవేత్సహి॥**" అని మహావాక్యరత్నావళి యందును, "స్మృ. **అస్యైకపాదవిద్యా స్యాన్నిరవిద్యా త్రిపాదభూత్॥**" అని బ్రహ్మప్రణవార్థప్రకాశికయందును చెప్పఁబడి యున్నది. కావున ప్రణవమందు అకారోకార మకారార్ధమాత్రస్వరూపములగు నవిద్యావిద్యానందపాదతురీయ పాదాత్మకములైన సమష్టివ్యష్టి స్థూలసూక్ష్మకారణ మహాకారణములనెడి యష్టశరీరముల యొక్క కార్యములగు జాగ్రత్స్వప్నసుషుప్తితురీయము లనెడు నాలుగవస్థలకు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరులు నలుగురు నధిదేవతలైరి. పంచదైవత మవుటవలన నయిదవవాఁ డైన సదాశివమూర్తికి స్థానము లేకపోయెను. గనుక మాండూక్యాద్యుపనిషత్తులయందు పైనఁజెప్పిన యవిద్యాదిపాదముల నాలుగింటిని పదియాఱుభాగములు చేయుటకు హేతువులు గలిగియుండుటవల్లను (శ్రు. గతాః కలాః పంచదశా ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు। కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరేవ్యయే సర్వ ఏకీభవంతి॥) అని రత్నావళియందు చెప్పఁబడి యుండుటవల్లను లోకకలలు పదియైదింటిని (మీఱిన పదియాఱవకల సదాశివమూర్తికి స్థానముగా నేర్పడుచున్నది) గాన ప్రణవము పదియాఱుభాగములుగ భాగింపఁబడెను. వానికి వివరణము. జాగ్రత్తలో జాగ్రత్త ॥1॥ జాగ్రత్తలో స్వప్నము ॥2॥ జాగ్రత్తలో సుషుప్తి ॥3॥ జాగ్రత్తలో తురీయము ॥4॥ స్వప్నములో జాగ్రత్త ॥5॥ స్వప్నములో స్వప్నము ॥6॥ స్వప్నములో సుషుప్తి ॥7॥ స్వప్నములో తురీయము ॥8॥ సుషుప్తిలో జాగ్రత్త ॥9॥ సుషుప్తిలో స్వప్నము ॥10॥ సుషుప్తిలో సుషుప్తి ॥11॥ సుషుప్తిలో తురీయము ॥12॥ తురీయములో జాగ్రత్త ॥13॥ తురీయములో స్వప్నము ॥14॥ తురీయములో సుషుప్తి ॥15॥ తురీయములో తురీయము ॥16॥ మఱియు త్రిస్థానమనియుండుటవలన సమష్టి వ్యష్టి తదుభయ చైతన్యైకమత్యబ్రహ్మవేత్తలని యర్థము. గనుక సమష్టిరూపుఁడైన యీశ్వరునకును వ్యష్టిరూపుఁడైన జీవునకును సమష్టివ్యష్టి చైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును జాగ్రదవస్థయందు అకారమును అవిద్యాపాదమును స్థూలదేహమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు విరాట్టు వైశ్వానరుఁడు వైరాజనుఁ

8. స్వప్నములో **తురీయము**– కలలో తాను కొండమీఁదను ఏనుఁగుమీఁదను నెక్కినట్లును లక్ష్మీదేవి తన్ను వరించి పొందినట్లును గని లేచి దాని ఫలమును విచారించి తనకు రాజ్యాధిపత్యము వచ్చుననియు సంపద గలుగుననియు నెంచక ఇది యంతయు మనోవ్యాపారముగాని వేఱుకాదని నిశ్చయించి బ్రహ్మనిష్ఠనుండి చలింపకుండుట.

9. సుషుప్తిలో **జాగ్రత్త**– సుఖముగా నిద్రించి లేచి ఆ నిద్రాసుఖమిట్టిదని తెలిసిచెప్పుట.

10. సుషుప్తిలో **స్వప్నము**– సుఖముగా నిద్రించియు దానివలన సుఖమెట్టిదో యది తోఁచియు తోఁచక యుండుట.

11. సుషుప్తిలో **సుషుప్తి**– నిదురించి లేచిన పిమ్మట దాని సుఖమిట్టిదని తెలియకయుండుట.

12. సుషుప్తిలో **తురీయము**– సుఖముగ నిద్రించియు ఈ నిద్రావస్థ అజ్ఞానవిషయముగాని ప్రజ్ఞానఘనప్రత్యగాత్మనైన నాకు విషయము కాదని తెలియుట.

13. తురీయములో **జాగ్రత్త**– బ్రహ్మనిష్ఠయందుండునప్పుడు జాగ్రత్తయందలి వ్యాపారములైన యాఁకలిదప్పులు తోఁచి ప్రపంచవృత్తి గలుగుట.

14. తురీయములో **స్వప్నము**– ఆ బ్రహ్మనిష్ఠయందుండునప్పుడు ఆఁకలిదప్పులు తోఁచి ప్రపంచవృత్తి కలిగి కలుగక యుండుట.

15. తురీయములో **సుషుప్తి**– బ్రహ్మనిష్ఠయందు వికల్ప మేమియు లేకయుండుట.

16. తురీయములో **తురీయము**– జాగ్రత్స్వప్నసుషుప్తులవలనఁగలిగెడి యాపది యైదు భేదములును లేక అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మము తానే కాని తన కంటె వేఱుగాదు అనెడు వృత్తిభేదములేక పరబ్రహ్మమగు తాను తానైయుండుట. ఇదే అవికల్పావికల్పము.

1. **జాగ్రత్త**– మనస్సు దశేంద్రియములతోఁగూడి శబ్దాదివిషయములయందు అనుభవము గలిగి యుండుటయే జాగ్రదవస్థ.

2. **స్వప్నము**– జాగ్రత్త క్రమక్రమముగ క్షీణించి గాఢనిద్రను బొందక అజాగ్రత్తయందలి విషయముల యనుభవము గలిగి యుండుటయే స్వప్నావస్థ.

3. **సుషుప్తి**– మానసాదిసర్వేంద్రియవ్యాపారశూన్యమే నిద్రావస్థ.

4. **తురీయము**– దేవుఁడు గలఁడనెడి ఆస్తికబుద్ధి గలిగి ప్రమాణములచేత అసత్తు సత్తు అనుభేదము గల లౌకికకర్మద్వైతాద్వైతముల కల్పనల విమర్శించి వస్తుజ్ఞానము గలిగి యుండుటే తురీయము. ఈ నాలుగవస్థలు నొక్కొక్కటి నాలుగేసిభాగములుగ భాగింపఁబడి పదియాఱవస్థలయ్యెను.



వచ్చినపుడు ఉకారములో ఉకారమును, విద్యాపాదములో విద్యాపాదమును సూక్ష్మదేహమందు సూక్ష్మదేహమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుఁడు, జీవునకు తైజసునిలో తైజసుఁడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతానుజ్ఞాత అని పేళ్ళు గలుగును.

3. స్వప్నములో సుషుప్తి–మఱియు నీచెప్పఁబడినమువ్వురికిని స్వప్నములో సుషుప్తి వచ్చినపుడు ఉకారములో మకారమును, విద్యాపాదములో ఆనందపాదమును, సూక్ష్మదేహమందు కారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు హిరణ్యగర్భునిలో అవ్యాకృతుఁడు, జీవునకు తైజసునిలో ప్రాజ్ఞుండు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతానుజ్ఞైకరసుండు అని పేళ్ళు గలుగును.

4. స్వప్నములో తురీయము– వెండియు పైని జెప్పఁబడిన మువ్వురికిని స్వప్నములో తురీయము వచ్చినపుడు ఉకారములో అర్ధమాత్రయును, విద్యాపాదములో తురీయపాదమును, సూక్ష్మదేహమందు మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు హిరణ్యగర్భునిలో పరమాత్మ, జీవునకు తైజసునిలో కూటస్థుఁడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞావికల్పుఁడు అని పేళ్ళు గలుగును.

**3.** సుషుప్తి– సమష్టిరూపుఁడైనయీశ్వరునకును వ్యష్టిరూపుఁడైనజీవునకును సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును సుషుప్త్యవస్థయందు మకారమును ఆనందపాదమును కారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతుఁడు అంతర్యామియను పేళ్ళును, జీవునకు ప్రాజ్ఞుఁడు పారమార్థికుండను పేరును, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసుఁడను పేరును గలుగును.

1. సుషుప్తిలో జాగ్రత్త–మఱి యీశ్వరజీవబ్రహ్మవేత్తలకు సుషుప్తిలో జాగ్రత్తవచ్చినపుడు మకారములో అకారమును, ఆనందపాదములో అవిద్యాపాదమును, కారణశరీరములో స్థూలశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో విరాట్టనియు, జీవునకు ప్రాజ్ఞునిలో విశ్వుఁడనియు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసోత యనియు పేళ్ళు గలుగును.

2. సుషుప్తిలో స్వప్నము– పైముగ్గురికిని సుషుప్తిలో స్వప్నము వచ్చినపుడు మకారములో ఉకారమును, ఆనందపాదములో విద్యాపాదమును కారణశరీరములో సూక్ష్మశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో హిరణ్యగర్భుఁడు జీవునకు ప్రాజ్ఞునిలో తైజసుఁడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసానుజ్ఞాత అని నామములు గలుగును.

3. సుషుప్తిలో సుషుప్తి– మఱియు నీమువ్వురికిని సుషుప్తిలో సుషుప్తి వచ్చినప్పుడు

మకారములో మకారమును, ఆనందపాదములో ఆనందపాదమును, కారణశరీరములో కారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో అవ్యాకృతుఁడు, జీవునకు ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుఁడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసానుజ్ఞైకరసుఁడు అను పేళ్ళు గలుగును.

4. సుషుప్తిలో తురీయము– మఱియు పైని జెప్పఁబడిన ముువ్వురికిని సుషుప్తిలో తురీయము వచ్చినపుడు మకారములో అర్ధమాత్రయును, ఆనందపాదములో తురీయపాదమును, కారణశరీరములో మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో పరమాత్మ, జీవునకు ప్రాజ్ఞునిలో కూటస్థుఁడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసావికల్పుఁడు అను నామములు గలుగును.

**4**. తురీయము– సమష్టిరూపుఁడగు నీశ్వరునకును వ్యష్టిరూపుఁడగుజీవునకును సమష్టివ్యష్టిచైతన్యైక్యమగుబ్రహ్మవేత్తకును తురీయావస్థ వచ్చునపుడు అర్ధమాత్రయును తురీయపాదమును మహాకారణశరీరమును గలుగును. అప్పుడీశ్వరునకు పరమాత్మయనియు, జీవునకు కూటస్థుఁడనియు, బ్రహ్మవేత్తకు అవికల్పుఁడనియు పేళ్ళు గలుగును.

1. తురీయములో **జాగ్రత్త**– ఈ ముువ్వురకును తురీయమున జాగ్రత్తవచ్చునపుడు అర్ధమాత్రలో అకారమును, తురీయపాదమందు అవిద్యాపాదమును, మహాకారణ శరీరమందు స్థూలశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు పరమాత్మలో విరాట్టనియు, జీవునకు కూటస్థునిలో విశ్వుఁడనియు, బ్రహ్మవేత్తకు అవికల్పోత యనియు పేళ్ళు గలుగును.

2. తురీయములో **స్వప్నము**– మఱియాముువ్వురకును తురీయములో స్వప్నము వచ్చునపుడు అర్ధమాత్రలో ఉకారమును, తురీయపాదములో విద్యాపాదమును, మహాకారణశరీరములో సూక్ష్మశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు పరమాత్మలో హిరణ్యగర్భుఁడనియు, జీవునకు కూటస్థునిలో తైజసుఁడనియు, బ్రహ్మవేత్తకు అవికల్పానుజ్ఞాతయనియును పేళ్ళు గలుగును.

3. తురీయములో **సుషుప్తి**– పైముువ్వురికిని తురీయములో సుషుప్తి వచ్చినపుడు అర్ధమాత్రలో మకారమును, తుర్యపాదములో ఆనందపాదమును, మహాకారణశరీరములో కారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు పరమాత్మలో అవ్యాకృతుఁడు, జీవునకు కూటస్థునిలో ప్రాజ్ఞుఁడు, బ్రహ్మవేత్తకు అవికల్పానుజ్ఞైకరసుఁడు అను నామములు గలుగును.

4. తురీయములో **తురీయము**– మఱియు నీముువ్వురికిని తురీయములో తురీయము వచ్చినపుడు అర్ధమాత్రయును, తురీయములో తురీయపాదమును, మహాకారణశరీరములో మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు పరమాత్మలో పరమాత్మ, జీవునకు కూటస్థుఁడు, బ్రహ్మవేత్తకు అవికల్పావికల్పుఁడు అను నామములు గలుగును.



ఇట్లేర్పడిన పదియాఱవస్థలయందు సమష్టిరూపుఁడైన యీశ్వరుఁడు సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వాది మహాగుణములును వ్యష్టిరూపుఁడైన జీవుఁడు "**అహంకర్తా అహంభోక్తా అహంసుఖీ అహందుఃఖీ అహంపాపీ అహందరిద్రః**" అనునివి మొదలగు స్వల్పగుణములును బ్రహ్మవేత్త ఆసర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వాదిగుణములయందు నిరభిమానము గలిగి యదృచ్ఛాలాభ సంతుష్టియు పరబ్రహ్మనిష్ఠయు మహాకర్తృత్వము మహాభోగము మహాత్యాగము మొదలగు సుగుణములును గలవారై వెలుంగుదురు. మఱియు కార్యమునుబట్టి కారణమును గ్రహింపవలయుఁ గావున కార్యములైన జాగ్రత్తాద్యవస్థలనుబట్టి కారణములయిన ఆకారాదివర్ణమయములును అవిద్యాదిపాదమయములును సమష్టిమయవ్యష్టిమయై– తదుభయైక్యస్వరూపములగు స్థూలాదిదేహములును తద్దేహాంతరవర్తులైన యీశ్వరజీవ బ్రహ్మవేత్తలకు గలిగెడు విరాడ్విశ్వోత్రాదినామధేయములును వివరముగ నెఱుఁగుటకై జాగ్రత్స్వప్నసుషుప్తితురీయమిశ్రములనెడు నవస్థలకు ఉదాహరణములు ఈ క్రింద వ్రాయఁ బడుచున్నవి.

1. జాగ్రత్తలో **జాగ్రత్త**– గురుసన్నిధానమున శాస్త్రశ్రవణము చేయునప్పుడు అడుగఁ దగినవిషయముల నడిగి తెలిసికొని మనసున మఱపులేక యుండుట.

2. జాగ్రత్తలో **స్వప్నము**– గురువువొద్ద శాస్త్రవిషయములను వినునప్పుడు పరాకుపడుటచేత ఆ విషయములు జ్ఞాపకముండియు నుండక యుండుట.

3. జాగ్రత్తలో **సుషుప్తి**– గురువువొద్ద సద్విషయములను వినవలయునని ప్రారంభించి వినునప్పుడు హెచ్చరిక లేమిచే అవి యేమియు బొత్తిగా జ్ఞాపకము లేకపోవుట.

4. జాగ్రత్తలో **తురీయము**– గురువువొద్ద శాస్త్రశ్రవణము చేయుటచే వస్తుతత్త్వజ్ఞానము గలిగి ఆ వస్తువును చింతించుట.

5. స్వప్నములో **జాగ్రత్త**–కల గని లేచి తాను కలలో కన్నదానినెల్ల తప్పక చెప్పుట.

6. స్వప్నములో **స్వప్నము**– కల గని లేచి అందలి విషయమును మఱచియు మఱవక యుండుట.

7. స్వప్నములో **సుషుప్తి**– కల గని మేలుకొని ఆ కలయందు తాను కన్నదంతయు మఱచుట.

రజోగుణమందలి తమోగుణమువలన స్వేదజములు, అండజములు, జలచరములు, మొదలగునవి పుట్టెను.

తమోగుణమందలి సత్త్వగుణమువలన పైరులు, కసువులు, గడ్డిపంటలు, మొదలగునవి యుదయించెను.

తమోగుణములోని రజోగుణమువలన చెట్లు, పొదలు, తీఁగలు లోనగునవి జనించెను.

తమోగుణములోని తమోగుణమువలన భూములు, కొండలు, ఱాళ్ళు మొదలగు స్థావరములు పుట్టెను.

మఱి సత్త్వమందలి సత్త్వము మొదలైన యా తొమ్మిదియును ఒక్కటొక్కటితోఁ గలసి సత్త్వతమస్తమస్సు, సత్త్వతమోరజస్సు, సత్త్వతమస్సత్త్వము, సత్త్వరజస్తమస్సు, సత్త్వరజోరజస్సు, సత్త్వరజస్సత్త్వము, సత్త్వసత్త్వతమస్సు, సత్త్వసత్త్వరజస్సు, సత్త్వసత్త్వసత్త్వము, రజస్తమస్తమస్సు, రజస్తమోరజస్సు, రజస్తమస్సత్త్వము, రజోరజస్తమస్సు, రజోరజోరజస్సు, రజోరజస్సత్త్వము, రజస్సత్త్వతమస్సు, రజస్సత్త్వరజస్సు, రజస్సత్త్వసత్త్వము, తమస్తమస్తమస్సు, తమస్తమోరజస్సు, తమస్తమస్సత్త్వము, తమోరజస్తమస్సు, తమోరజోరజస్సు, తమోరజస్సత్త్వము, తమస్సత్త్వతమస్సు, తమస్సత్త్వరజస్సు, తమస్సత్త్వసత్త్వము, అని యిరువదియేడుభేదము లయ్యెను. అందు,

1. సత్త్వగుణముతోఁ గలసిన తమోగుణమందలి తమోగుణమువలన శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, కర్కోటకుఁడు, శంఖుఁడు, మొదలగు సర్పములును, హాహాహూహూ మొదలగు గంధర్వులును, అశ్వముఖంబును నరశరీరమునుగల కిన్నరులును, మాణిభద్రుఁడు మొదలగు కింపురుషులును, కామరూపధరులును, ముప్పదియార్వురు తుషితులును, నైరృతి మొదలగు రాక్షసులును, అసురేంద్రుఁడు లోనగు నఱువది యాఱుకోట్లదైత్యులును, కుబేరుఁడు లోనగు యక్షులు మొదలగువారు పుట్టిరి.

2. సత్త్వ...మందలి రజోగుణమువలన ముప్పదిమూఁడుకోట్ల దేవతలును యముడు అంగిరసుఁడు అగ్నిష్వాత్తుఁడు కవ్యవాహనుఁడు ఆజానజాను లు మొదలగు పితృదేవతలును పుట్టిరి.

3. సత్త్వ...మందలి సత్త్వగుణమువలన భూలోకమందలి జనులకు అగ్నిష్టోమాదివైదికకర్మములఁజేయ బుద్ధిపుట్టించుటకును వారికి తమసారూప్యాది పదవుల నిచ్చుటకును సత్తగలిగి దేవలోకమందుండు కర్మదేవతలును సూర్యుఁడు మొదలగు నవగ్రహములును వాని పరివారసమూహము వసించు లోకములును పుట్టెను.

1. సత్త్వగుణముతోఁ గలసిన రజోగుణమందలి తమోగుణమువలన



ఈ యవస్థలు పదియాఱింటియందు తమోగుణప్రధానులగువారు తమ పాషాణజలచరక్రిమిపశుపక్షిప్రాయులై మూఢవృత్తిగలవారయి యుందురు. రజోగుణప్రధానులగువారు ఘోరవృత్తి గలిగి పామరులై కర్మభక్తిజ్ఞానములలో నొక్కటియేని లేక కుటుంబపోషణాసక్తి గలిగి మనుష్యస్వభావముగలవారై నాస్తికలౌకికులై యుందురు. సత్త్వగుణప్రధానులగువారు శాంతవృత్తి గలిగి బుద్ధిమంతులై పుణ్యకర్మాసక్తియు దేవతాంతరభక్తియు పుణ్యలోకానురక్తియుఁ గలిగి దేవతాస్వభావము గలవారై యుందురు. గుణసామ్యవస్థగల వివేకులు శుద్ధసత్త్వసంపన్నులై సగుణోపాసకులై యుందురు. (కేవల బ్రహ్మవేత్తలు జాగ్రత్త మొదలగు పదియైదవస్థలుగల ప్రకృతి నతిక్రమించి అవికల్పావికల్ప పరబ్రహ్మనిష్ఠగలవారై యుందురు. మఱి యీ పదియైదు కలలు త్రిగుణవిభాగములచేత నొకటితో నొకటి పలుమాఱు గూడి యనేకభేదములై పంచదశకలాత్మక మూలాతూలాప్రకృతి రూపములై లోకవ్యాపకములై యుండును. పదియాఱవకల కేవలసత్తామాత్రమై మూలప్రకృతి కాశ్రయమై స్వయంప్రకాశమై యుండును. కనుకనే "**కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యా**" మని శివానందలహరి యందును, "**శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితు**" మని సౌందర్యలహరి యందును, "**సర్వం ఖల్విదం బ్రహ్మ, పురుషాన్నపరం కించిత్, పురుష ఏవేదగ్ం సర్వం, ఏకో దేవో బహుధా నివిష్టః, ఏకం సంతం బహుధా కల్పయంతి, అజాయమానో బహుధా విజాయతే తస్య ధీరాః పరిజానంతి యోనిం, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, స బ్రహ్మ స శివ స్సహరి స్సేంద్రస్సోక్షరః పరమః స్వరాట్**" అని యుపనిషత్తుల యందును, "శ్రు. **అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే, ప్రతిబింబిత శాఖాగ్రఫలాస్వాదనమోదవత్**" అని మహావాక్యరత్నావళియందును చెప్పఁబడియున్నది. కాబట్టి ప్రణవార్థానుభవము గలిగి పదియాఱవకల యగు తురీయతురీయస్వరూపుఁడయి యానందించువాఁడే **బ్రహ్మవేత్త**. ఈ విషయములు కరతలామలకముగఁ దెలియుటకై **బ్రహ్మప్రణవచక్రము** * వ్రాయఁబడుచున్నది. * *276వ పేజీ చూడగలరు.*

**అవతారిక:-** చంద్రునియందలి చంద్రికవలె తటస్థాతద్వ్యావృత్తిస్వరూపలక్షణ లక్షితపరబ్రహ్మము నెడఁబాయని **పరబ్రహ్మిణి** వినుతింపఁబడుచున్నది.

**చ॥ సలలితతుర్యతుర్యశివసన్మయునం దవినాస్వభావయై**
**కలసి త్రిరూపయై స్వగుణకల్పితకృత్యము లం దొనర్చుచు౯**
**వెలయు చిదాత్మశక్తి సువివేక మొసంగ నుతింతు సన్మనో**
**నిలయిని దేవి మత్కృతి వినిర్మల మొంద సదా ముదంబున౯. 2**

**టీకా :-** సలలిత...నందు౯-సలలిత=ఒప్పిదమైన, తుర్యతుర్య=బ్రహ్మప్రణవమందలి పదియాఱవభాగమైన అవికల్పావికల్ప మనుపేరుగల, శివ=సూర్యచంద్రానల కాంతులను

మిఱిఁ వెలుఁగుచున్న, సన్మయునందుఁ=దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమైన పరబ్రహ్మమందు, అవినాస్వభావయై=అమలసత్త్వగుణస్వభావము గలిగి వేఱుపాటు లేనిదై, కలసి= పరబ్రహ్మముతోఁగూడి(పిమ్మట) త్రిరూపయై=మలిన సత్త్వస్వభావముచేత లక్ష్మీపార్వతీ సరస్వతులనెడు మూఁడు రూపములుగలదై, లేక, యిచ్ఛాజ్ఞానక్రియా రూపములు గలగాయత్రీ, సావిత్రీసరస్వతులనెడి మూఁడు రూపములుగలదై లేక, భిన్న, అభిన్న, భిన్నాభిన్న, అను త్రివిధరూపములుగల, త్రిపద, త్రిబీజ, త్రికూటము లనెడు గాయత్రీ, బాలా, పంచదశాక్షరీ, మంత్రదేవతారూపిణియై, వీనిలో కర్మకాండపరిపూర్తికి గాయత్రి, భక్తికాండ పరిపూర్తికి బాల, జ్ఞానకాండ పరిపూర్తికి పంచదశాక్షరి ఉపాస్యలని యెఱుఁ గునది. స్వగుణకల్పితకృత్యములు, స్వ=స్వకీయములైన, గుణ=సత్త్వరజస్తమో గుణములచేత, కల్పిత=పుట్టింపఁబడిన, కృత్యములు=సగుణబ్రహ్మాదిదేవతాజంగమ స్థావరాంతమగు నిరువదియేడు భేదములుగల ప్రాణులసృష్టిస్థితిసంహారతిరోధా–నానుగ్రహము లనెడు పంచకృత్యములు, అందుఁ=ఆ పరబ్రహ్మమందు, ఒనర్చుచుఁ=లేనిదే యున్నట్టుగ తోఁపింపఁజేయుచు, వెలయు చిదాత్మశక్తిఁ–వెలయు=ప్రకాశించునట్టి, చిదాత్మశక్తిఁ= విజ్ఞానస్వరూపమైన పరబ్రహ్మశక్తియైనదియును, సన్మనోనిలయినిఁ–సత్= బ్రహ్మవేత్తల యొక్క, మనః=అంతఃకరణములయందు–అనఁగా చిదాకాశములయందు, నిలయినిఁ= నివశించునదియునునైన, దేవిఁ=(సకలవస్తువులయందు ఆయా వస్తునామ రూపములచేత క్రీడించునట్టి) త్రిపురసుందరిని, సువివేక మొసంగఁ=**అహం బ్రహ్మాస్మి** యను దివ్యజ్ఞానము నిచ్చుటకును, మత్కృతి=నాచేతఁ జేయఁబడిన **కైవల్యనవనీతము** అనెడి యీ యోగశాస్త్రమును, వినిర్మల మొందఁ=అప్రయుక్తాదిసకలదోషములులేక యుండునట్లు చేయుటకును, ముదంబునఁ=నిరతిశయానందముతోడ, సదా=ఎల్లప్పుడు, నుతింతుఁ= కొనియాడుచున్నాను.

**తాత్పర్యము :–** సచ్చిదానందనిత్యనిర్మలములనెడు పంచలక్షణములచేత మనోహరమగు పరబ్రహ్మమునందు, అమలసత్త్వస్వభావముచేత, అగ్నియం దుష్ణప్రకాశరూపశక్తియున్నట్లు, అభిన్నముగఁగూడి యుండి, పిమ్మట మలినసత్త్వస్వభావముగలదై, లక్ష్మీపార్వతీ సరస్వతులనెడు మూఁడు రూపములుగలదై, స్వకీయములగు సత్త్వరజస్తమోగుణములచేత, సగుణబ్రహ్మాదిదేవతాజంగమస్థావరాంతమైన యిరువదియేడు భేదములుగల ప్రాణులను, పుట్టించుట, పెంచుట, త్రుంచుట, మఱుఁగుపఱచుట, మఱలఁగనఁబఱచుట లనెడు పనుల నైదింటిని ఆ పరబ్రహ్మమే చేయుచున్నదన్నట్టుగ తోఁపింపఁజేయునదియును, బ్రహ్మజ్ఞానులయంతఃకరణములయందు నివసించునదియును, సకలపదార్థములయందు ఆయా నామరూపములచేత క్రీడించునదియును నైన పరబ్రహ్మిణిని "అహంబ్రహ్మాస్మి" యను నిశ్చయజ్ఞానము నిచ్చుటకును, ఈ గ్రంథము నిర్విఘ్నముగను, నిర్దోషముగను



నెఱవేర్చుటకును, ఎల్లప్పుడు స్తుతించుచున్నాననుట.

మఱి యీపద్యమందలి రెండవచరణమున "త్రిరూపయై స్వగుణకల్పితకృత్యములం దొనర్చుచుఁ" అని యుండుటవలన మొదట పరబ్రహ్మిణి, తురీయతురీయనిర్గుణపరశివ బ్రహ్మమందు చంద్రునియందలి చంద్రికవలె, అవినాభావముగఁగలిసి పిమ్మట అమలసత్త్వ ప్రధానయైనందున ఆ పరబ్రహ్మము తటస్థలక్షణముచేత ఆ పరబ్రహ్మిణితోఁగూడి సగుణబ్రహ్మమయ్యెను. ఆ యమలసత్త్వప్రధానచేతనులకు జన్మార్జితపుణ్యవశమువలన బ్రహ్మజ్ఞానముఁ గలిగించి తటస్థలక్షణస్వరూపుఁడైన పరబ్రహ్మమును జూపి వెనుక నిర్గుణస్వరూపుఁడగు పరబ్రహ్మమందైక్యము గలుగఁజేయును. వెనుక ఆ యమలసత్త్వ ప్రధానయే మలినసత్త్వప్రధానయై గాయత్రీ సావిత్రీ సరస్వతులనెడు మూఁడురూపములుగఁ గనఁబడి, ఆ పరబ్రహ్మమందు స్వగుణములైన సత్త్వరజస్తమస్సులచేత పుణ్యపాపమిశ్ర భేదములు గల దేవ తరు పాషాణ జలచర క్రిమి మృగ పక్షి నరులతోఁ గూడిన త్రిజగములను తోఁపింపఁజేసి వానికి సృష్టిస్థితిసంహారతిరోధానానుగ్రహములఁ గలుగఁజేయుచు నుండును. ఆ త్రిగుణములవలనఁ బుట్టినవి యీక్రింద విభజనగఁ దెలుపఁబడుచున్నవి.

సత్త్వగుణమువలనఁ జతుర్ముఖబ్రహ్మ మొదలగు ముప్పదిమూఁడుకోట్లదేవతలు పుట్టిరి.

రజోగుణమువలన మనుష్యులు, మృగములు, పక్షులు, పురుగులు, జలచరములు లోనగు సకల జంగమప్రాణులు పుట్టెను.

తమోగుణమువలన భూమి పర్యంత వృక్షపాషాణములు మొదలగు స్థావరము లన్నియుఁబుట్టెను. ఈ త్రిగుణములు ఒక్కటొక్కటితోఁ గలిసి సత్త్వసత్త్వము, సత్త్వరాజసము, సత్త్వతమస్సు, రజస్సత్త్వము, రజోరజస్సు, రజస్తమస్సు, తమస్సత్త్వము, తమోరజస్సు, తమస్తమస్సు అని తొమ్మిదివిధములయ్యెను.

అందు సత్త్వగుణ మందలిసత్త్వగుణమువలన విరాట్టు సూత్రేశ్వరుఁడు మొదలగు వారు పుట్టిరి.

సత్త్వగుణమందలి రజోగుణమువలన, దేవఋషులు, అఱువదినాలుగుకోట్లు వాలఖిల్యులు వైఖానసులు మొదలగువారు జనించిరి.

సత్త్వగుణమునందలి తమోగుణమువలన యక్షులు రక్షస్సులు విద్యాధరులు లోనగువారు జన్మించిరి.

రజోగుణమందలి సత్త్వగుణమువలన జనసంఘ ముదయించెను.

రజోగుణమందలి రజోగుణమువలన నాలుగుకాళ్ళుగల పశువులు మృగములు మొదలగునవి గలిగెను.

పూజింపఁదగిన పద్మములు కలువలును, కల్పకము పారిజాతము మందారము హరిచందనము సంతానము లోనగు కల్పవృక్షములును, పొన్నలు సురపొన్నలు లోనగునవియును పుట్టెను.

1. తమోగుణముతోఁగూడిన సత్త్వగుణమందలి తమోగుణమువలన తమిదె ఉలవ జొన్న కొఱ్ఱ సజ్జ ఆరిక వరిగ మొదలగు క్షుద్రధాన్యములును, ఆవాలు మిరియాలు మిరపకాయలు మొదలైనవి పండెడి నేలలు నుదయించెను.

2. తమో...మందలి రజోగుణమువలన నల్లవరి కంది నువ్వు మినుము అనుము ఆముదములు లోనగు పైరులును, జాజికాయలు లవంగములు ఏలకకాయలు పసుపులోనగునవి పండెడు నేలలును పుట్టెను.

3. తమో...మందలి సత్త్వగుణమువలన తెల్లవరి సన్నవరి నివ్వరివరి పెసలు గోధుమలు యవలు చామలు చెఱకు మేలగుకాయలు పండ్లు ఆకులు పూవులు మొదలైనవి పండెడు నేలలు పుట్టెను.

ఇవ్విధముగ సమష్టిరూపమైన మూలావిద్య వ్యష్టిరూపమైన తూలావిద్య అనెడు రెండురూపములుగల మలినసత్త్వప్రధానయగు మూలప్రకృతి తనత్రిగుణములచేత తొలుత త్రిశక్తులుగఁ దోఁచి వెనుక ఆ త్రిగుణపరస్పరసమ్మేళనమువలన నవవిధములై పిదప ఆ నవవిధాన్యోన్య సమ్మేళముచేత సప్తవింశతివిధములై తెల్లనివస్త్రమున చిత్రములు కల్పితమైనట్టు శుద్ధపరబ్రహ్మమందు పైని జెప్పఁబడిన యిరువదియేడు భేదములుగల సృష్టిగలయట్లుగఁగనఁబఱిచెను. మఱి వేదపురుషుఁడు ఈ యిరువదియేడు భేదములుగల సృష్టికి కారణమైన ప్రకృతిమయమగు గాయత్రి మూఁడు పాదములును "**భూర్భువస్సువ**" యను వ్యాహృతి త్రయముతోడ నిరువదియేడు అక్షరములును గలదని చెప్పి దానిని ద్విజాతులగు బ్రహ్మ క్షత్రియవైశ్యులకు తారతమ్యముగ నుపాస్యముగ నిర్ణయించెను. మఱి యా గాయత్రికి మాఱురూపమగు యజ్ఞోపవీతము మూఁడు సూత్రములు గలది. అందొక్కసూత్రమునకు మూఁడేసి అంతరసూత్రములు గలవు. ఆ యాంతరసూత్రములయం దొక్కటొక్కటికి మూఁడుమూఁడుపోగులు గలవు గాన మూఁడు పెద్దపోగులుగల ఆ యజ్ఞోపవీతము ఇరువది యేడుపోగులు గలదయ్యెను. ఆ తంతువులే యిరువదియేడు భేదములుగల జగత్తు, ఆ జగద్రూపమగు యజ్ఞోపవీతమునే గాయత్రి యని ద్విజాతులు ధరించి పరబ్రహ్మము నుద్దేశించి సర్వకర్మములఁ జేయవలయు ననియు దాని ధరించుదాఁక కర్మకాండ మనుష్ఠింపవలయు ననియు, వెనుక సద్గురుకరుణచేత విజ్ఞానము కలిగి గాయత్రీయజ్ఞోపవీతప్రపంచవిచారణ చేసి యజ్ఞోపవీతమందలి మూఁడుతంతువులకు కూటస్థానమైన ముడియే బ్రహ్మముడి యనియు అదియే అమలసత్త్వప్రధానయగు



అణిమాదిసిద్ధులుగల విశ్వావసుపరావసుప్రభృతిసిద్ధులును, మనుఁడు హనుమంతుఁడు విష్ణువు ధర్ముఁడు నారాయణుఁడు మొదలగు సాధ్యులును, బ్రహ్మర్షులగు సనకాది మహామునులు మొదలైనవారు పుట్టిరి.

2. సత్త్వ...మందలి రజోగుణమువలన నిత్యపవిత్రులగు వసిష్ఠాగస్త్యదధీచి గౌతమభరద్వాజాదిఋషులును, శుకవామదేవజాబాల్యాదిమౌనులును, భగవన్నామ పరాయణులగు ప్రహ్లాదపుండరీకనారదాంబరీషాదిపరమభాగవతులును పుట్టిరి.

3. సత్త్వ...మందలి సత్త్వగుణమువలన ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులును ముప్పదిమూఁడుకోట్ల వేలుపులును, బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులును, బృహస్పతి విశ్వకర్మ నందికుమారగణనాథాదులును, దుర్వాసోదత్తాత్రేయాదిమహర్షులును కాలాగ్ని రుద్రహాటకేశ్వరాదులును పుట్టిరి.

1. సత్త్వగుణముతోఁగలసిన సత్త్వగుణమందలితమోగుణమువలన విరాట్పురుషుఁ డు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడు స్థూలగణేశ్వరుఁడు సవికల్పకజ్ఞాననిష్ఠులు లోనగువారు పుట్టిరి.

2. సత్త్వ...మందలి రజోగుణమువలన సూత్రాత్ముఁడు సూక్ష్మనాయకుఁడు నిర్వికల్పకసమాధినిష్ఠులు, బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు బ్రహ్మవిద్వరీయుఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు లోనగు జీవన్ముక్తులును ఉద్భవించిరి.

3. సత్త్వ...మందలి సత్త్వగుణమువలన సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము, సర్వకర్తృత్వము, సర్వనియామకత్వము లోనగు మహాగుణములును సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహము అనెడిపంచకృత్యములును గల పరమేశ్వరుఁడు పుట్టెను.

1. రజోగుణముతోఁగూడిన తమోగుణమందలి తమోగుణమువలన అడవియీఁ గలు తేళ్లు కందిరీఁగలు ఉసిళ్లు చీమలు ఈఁగలు పాములు మిడుతలు మింటను మంటను పుట్టు జంతువులగు మిడుఁగురుపురుగులు పట్టుపురుగులు ముఖమల్పురుగులు చెమటవల్ల పుట్టెడి పేలు ఈళ్లు చీర పేలు ఎఱ్ఱులు నల్లులు దోమలు లోనగునవి పుట్టెను.

2. రజో...మందలి రజోగుణమువలన మొసళ్లు ఎండ్రకాయలు నత్తలు గవ్వలు కాకిచిప్పలు ముత్తెపుఁజిప్పలు సంకులు చేపలు తాఁబేళ్ళు నీటిపాములు కప్పలు జలగలు లోనగు జలజంతువులును పుట్టెను.

3. రజో...మందలి సత్త్వగుణమువలన కాకులు పిచ్చుకలు చిలుకులు గోరువంకలు నెమిళ్ళు హంసలు కొంగలు చక్రవాకములు చకోరములు గండభేరుండములు శరభములు డేగలు సాళువములు కోకిలలు గరుడపక్షులు గ్రద్దలు కౌఁజులు వానకోయిలలు గువ్వలు కోళ్ళు పావురాళ్ళు గిజిగాళ్ళు లోనగు పక్షులు పుట్టెను.

1. రజోగుణముతోఁగూడిన రజోగుణమందలి తమోగుణమువలన సింహములు పులులు అడవిపందులు ఎలుఁగులు ఊరఁబందులు ఎలుకలు పందికొక్కులు కుక్కలు నక్కలు పిల్లులు బల్లులు చివంగులు తోఁడేళ్ళు కుందేళ్ళు గాడిదలు చిఱుతపులులు ఉడుములు లోనగు మృగములు పుట్టెను.

2. రజో...మందలి రజోగుణమువలన క్రోఁతులు ఏనుఁగులు గుఱ్ఱములు మేఁకలు గొఱ్ఱెలు ఎనుములు పునుఁగుజవ్వాజిపిల్లులు కస్తూరిమృగములు ఒంటెలు ఖడ్గమృగములు లోనగునవి పుట్టెను.

3. రజో..మందలి సత్త్వగుణమువలన కామధేనుకులమునఁబుట్టిన కఱియావులు మొదలగు గోవులును, చమరీమృగములు నల్లయిఱ్ఱులు జింకలు దుప్పులు లోనగునవి పుట్టెను.

1. రజోగుణముతోఁగూడిన సత్త్వగుణమందలితమోగుణమువలన శూద్రులును మంగల చాకల మాల మాదిగలును, శబర హూణ మ్లేచ్ఛ కంక కిరాతకులును, బోయ ఎఱుక ఏనాది చెంచు దొమ్మరి కుమ్మరి సాలె జాంద్ర అగసాలె లోనగు జాతులవారును, మద్యమాంసభక్షకులును, జనభయంకరులును చోరులును కటికివాండ్రును మఱియు ఘాతుకపుఁబనులు చేయువారును లోనగువారు పుట్టిరి.

2. రజో...మందలి రజోగుణమువలన, చదువుట, ఇచ్చుట, పుణ్యకర్మములు చేయుట, దుష్టనిగ్రహ శిష్టపరిపాలన భూరక్షణములు లోనగు పనులు గల రాజులును, దున్నుట, ఆవులఁగాచుట, బేరమాడుట, లోనగు పనులుగల కోమట్లును, బేరులును లోనగువారు పుట్టిరి.

3. రజో...మందలి సత్త్వగుణమువలన బ్రహ్మవాదులును వేదశాస్త్రాదివిద్యాధ్యయన సంపన్నులును బ్రహ్మచర్యాద్యాశ్రమాచారవంతులును అయిన ఆన్ధ్ర కర్ణాట ద్రావిడ ఘూర్జర మహారాష్ట్రులనెడు పంచవిధద్రావిడులును, ఉత్కల మైథిల గౌడ కనోజ సారస్వత సార్వర్యులనెడి పంచగౌడులును పుట్టిరి. వీరే దశవిధ బ్రాహ్మణులు.

1. తమోగుణముతోఁగూడిన తమోగుణమందలి తమోగుణమువలన, నీళ్ళులేని భూములును, కొండలు ముండ్లచెట్లు గండ్లు ఊళ్ళు లోనగునవి గలిగి జనులచేత పోఁ గూడనిమార్గములును జనులు సంచరింపదగినకొండలును, మొఱపనేలలును, చవిటి నేలలును, తృణకాష్ఠజలసమృద్ధులులేక దేవబ్రాహ్మణవర్జితములును నై పరోపకారరహితు లగు కేవల తమోగుణజనులకు నివాసములై కంపు చేఁదు ఉప్పు గల జలములుగలిగి భూతదయాపశ్చాత్తాపములులేక భూతవేతాళబ్రహ్మరాక్షసాది దుష్టగ్రహనివాసములై తామసాహారములును తామసదానములును తామసతపస్సులును తామసశ్రద్ధలును తామసయజ్ఞములును గల జనులు వసించు గ్రామములుగల దేశములు పుట్టెను.



2. తమో...మందలిరజోగుణమువలన సారవంతములై పంటలకుఁదగి తియ్యని తేటచల్లనినీళ్ళు గలిగి రాజసాహారములు దానములు తపస్సులు శ్రద్ధలు యజ్ఞములు గల జననివాససంచారయోగ్యములైన భూములును, మృదువులై జారచోరకంటకరహితములైన మార్గములును, మేలగు కొండలును రేగటిమన్ను ఎఱ్ఱనిమన్ను గల నేలలును, మృదువులై మనుష్యకార్యములకు యోగ్యములైన ఊళ్ళును సామాన్యజంతువులచే పూజింపఁబడెడి దేవబ్రాహ్మణనివాసయోగ్యములైన యూళ్ళును గల దేశములును జనించెను.

3. తమో...మందలి సత్త్వగుణమువలన పుణ్యక్షేత్రములును గంగాదిపుణ్య నదులును పవిత్రజలములుగలిగి దేవతలచేత బ్రాహ్మణులచేత నెల్లప్పుడు సేవింపఁబడెడు కాశి, కాంచి, మథుర, అయోధ్య, ద్వారవతి అవంతి లోనగు పుణ్యపట్టణములు గల భూములును వేంకటాద్రి, భద్రాద్రి, సింహాద్రి, అరుణాచలము, శ్రీశైలము, అగస్త్యగిరి, కైలాసము, హిమాలయము, మేరుగిరి, సుందరపర్వతము లోనగు పుణ్యపర్వతములును, గోపిచందన శ్వేత మృత్తికలును, ఫల పుష్పపత్ర యోగ్యములగు చెట్లుగల నేలలును సజ్జనసంచారమార్గములును సాలగ్రామబాణలింగశోణభద్రాగణపతి స్వర్ణ నిమళరాజావర్తములును యమున ఊళ్ళును లోనగు శిలలును బంగారు వెండి లోనగు లోహములు పుట్టెడిచోట్లును వజ్రము వైడూర్యము లోనగు రత్నములగనులుగల నేలలును బ్రహ్మవిట్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులగు మహర్షుల సంచారమునకు నివాసమునకుఁ దగిన స్థలములును సాత్త్వికాహార దానతపోయజ్ఞశ్రద్ధలుగల జనులకు నివాసపాత్రములగు క్షేత్రములును పుట్టెను.

1. తమోగుణముతోఁగూడిన రజోగుణమందలి తమోగుణమువలన చేఁదు ముండ్లు గలిగి నీడలు పువ్వులు పండ్లు లేక నిద్రాలస్యములు సోమరితనము లోనగు తామస గుణములు గల దుర్జనులకుఁ దగిన ముష్టి వేము తుమ్మ బలురక్కసి నాగచెముఁడు తాటి తాఁడి యీఁత లోనగు నికృష్టపుచెట్లును దుర్గంధసహితములై అల్పజలములుగల యేళ్లను పిశాచ దుష్టజనసంచారములకుఁ దగిన యూళ్లను పుట్టెను.

2. తమో...మందలి రజోగుణమువలన రాజసజనులకు యోగ్యములైన ఫలపుష్పపత్రములు గలిగి ఔషధములకు భక్షణములకుఁదగిన నిమ్మ దానిమ్మ జమ్మి మఱ్ఱి కానుఁగు నేరేడు చింత లోనగు తరువులును మనుష్యులచే సేవింపఁదగిన పుష్పములు, తీఁగెలు, పొదలు, పొదరిండ్లును పుట్టెను.

3. తమో...మందలి సత్త్వగుణమువలన సాత్త్వికజనులకుఁదగిన, అరఁటి, పనస, మామిడి వెలగ రావి తులసి బిల్వము మల్లె లోనగు చెట్లును, యజ్ఞములకుఁదగినచంద్ర మేఁడి ఉత్తరేణి దర్భ లోనగునవియును, దేవర్షులు, బ్రాహ్మణులు లోనగు నుత్తములచేత

**త్రిజగత్పూజ్యముగా నొనర్చి గురుఁడై దీపించి కైలాసశై**
**లజలింగం బలతిల్ల నిల్పు శివలీలాశంకరుం గొల్చెదన్॥ 4**

**టీకా :-** మున్=పూర్వము, అజసంస్తోత్రముఙ,అజ=బ్రహ్మయొక్క, సంస్తోత్రమున్= పొగడికను, ఎఱింగి=తెలిసికొని, (అనఁగా=వేదబాహ్యులై దేహమే పరమాత్మ, మరణమే మోక్షము, అనెడు చార్వాకులును,) ఇంద్రియములే పరమాత్మ, మరణమే మోక్షము, అను చార్వాకైకదేశికులును, ప్రాణమే పరమాత్మ, దానినాశమే మోక్షము, అనెడి **సౌగతు**లును, దేహేంద్రియప్రాణములసంకోచవికాసావస్థలు గలవాఁడే ఆత్మ, నిత్యమును పరమాణురూపమునైన అలౌకికాకాశమధ్యమందు క్రమక్రమముగ సంచరించుటే మోక్షము, అనెడి **జైనులు**ను, బుద్ధియే బ్రహ్మము, సుఖదుఃఖాదిద్వంద్వముల నంటని శుద్ధబుద్ధి గల్గియుండుటే మోక్షము, అనెడు **బౌద్ధులు**ను; శూన్యమే ఆత్మ, దానియందుఁగలియుటే మోక్షము, అనెడి **ఆర్హతులు**ను, నీటియందు బుగ్గలు కనఁబడినట్లు శూన్యమందు బహురూపములు తోఁచునదే యాత్మ, ఆ రూపములు వీడి శూన్యమందుఁ గలియుటే మోక్షము అనెడి **క్షపణులు**ను, ఆనందమే ఆత్మ ఆకాశగమనదూరదృష్టిదూరశ్రవణాదిసిద్ధులు గలిగియుండుటే మోక్షము, అనెడు **రుద్రకౌళభైరవయామళులు**ను, ఆనందమే ఆత్మ, ఆనందోద్బోధకములైన మధుమాంససంగమాదులవలనఁ గలుగు ఆనందప్రాప్తియే మోక్షము అనెడు **శాక్తేయులు**ను, నాడీమధ్యమున అణుపరమాణుస్వరూపమున వెలుఁగుచు ఇరువదియాఱవతత్త్వరూపుఁడై **పరము వ్యూహము విభవము అర్చ అంతర్యామి** అను రూపముల మెఱయు వాసుదేవుఁడే ఆత్మ, వానియందు స్వరూపహాని లేక కైంకర్యపరుఁడై యుండుటే మోక్షము, అనెడి **పాంచరాత్రులు**ను, ఇందు పర మనఁగ పరమపదము. వ్యూహము లనఁగా వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధవ్యూహములు. (అందు వాసుదేవవ్యూహము పరమపదము, సంకర్షణవ్యూహము పాతాళము, ప్రద్యుమ్నానిరుద్ధవ్యూహములు క్షీరాబ్ధిమేరువులు, విభవ మనఁగా రామకృష్ణాద్యవతారములు. అర్చయనఁగా వేంకటాచలము, శ్రీరంగము, కాంచి, మేలుకోట లోనగు స్థల విగ్రహారాధనములు, అంతర్యామి యన జీవుఁడే దేహముగఁగల వాసుదేవుఁడు, అని యెఱుఁగవలయును. దేహపుత్రమిత్రకళత్రపశుభృత్యాదులే ఆత్మ, ఇహపరములలో వారికి ఆధివ్యాధులు లేక వారితోఁ గూడి సుఖముగ నుండుటే మోక్షము, అనెడి **లౌకికులు**ను, స్వతస్సిద్ధముగ ప్రమాణసమేతుఁడే ఆత్మ, స్వర్గవైకుంఠకైలాససత్యలోకాదులసాలోక్యాదిపద ప్రాప్తియే మోక్షము, అనెడు **పూర్వమీమాంస**కులైన భాట్టప్రాభాకరులును, మింటివలె మితము లేక శిలవలె జడరూపుఁడై మనోబుద్ధిధర్మములు గలవాఁడే ఆత్మ, శరీరేంద్రియాదికములనెడు నిరువదియొక విధములైన దుఃఖములు లేక ఱాతివలె నుండుటే మోక్షము, అనెడు **నైయాయిక వైశేషికులు**ను, మింటివలె దేని నంటక జ్ఞానస్వరూపమున



గుణసామ్యావస్థయనియు తెలిసి ఆ యజ్ఞోపవీతమును పరిత్యజించుటే సన్న్యాసమనియు అతఁడే బ్రహ్మకాండ మనుష్ఠించువాడనియు తెలిపెను. ఈ కిటుకు తటుకున తెలిసినవాఁడే సర్వకర్మవిముక్తుఁడు జీవన్ముక్తుఁడు. పైనిజెప్పిన ఈ యిరువదియేడు భాగములును సారెసారెకు నొకటితో నొకటి కలిసియనేక విధసృష్టులు గలుగును. గుణత్రతయవివేక శాస్త్రమునుబట్టి నాకు గోచరించినవఱకు వ్రాసితిని. బుద్ధిమంతులగువారు మీఁదుగ నూహించునది. ఇందులకు స్మృతిశ్రుతులు. శ్లో॥ **దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా। మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.** తా॥ ఈ మాయ త్రిగుణస్వరూపిణి, నాసన్నిధానబలమున సకలప్రాణులను నాయందు, తనత్రిగుణములవలన కల్పించి, వానియందుఁ గ్రీడించుచుండును. అస్మచ్ఛబ్దవాచ్యుఁడనైన నన్నెఱిఁగి పొందువారు ఈ మాయ నతిక్రమింతు రనుట. ఇట్లని గీతావచనము.

శ్రు. **అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపాం, అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః.** తా॥ మూలప్రకృతి సూర్యకాంతి సూర్యునకు వేఱుగానియట్లు, పరబ్రహ్మము నెడఁబాయక ఆ స్వరూప మాత్రముగ నుండెడు శుద్ధసత్త్వప్రధానము. ఆ సూర్యకాంతి సూర్యుని వీడకయే వెలుపల వ్యాపించి చీఁకటిని తనయందు నణఁచుకొని, తనయం దాసూర్యుఁడు కలదిగ ప్రకాశించు తీరున, ఆ పరబ్రహ్మమును విడువకయే బహిర్వ్యాపకము గలదై సృష్టిస్థితిలయాదులు లేనిపరబ్రహ్మమును తా నావరించి, అది తనయందుఁగలయట్లుగను, దానికి సృష్టిస్థితిలయాదులు కలయట్లుగను కనఁబడఁజేయు మలినసత్త్వప్రధానము, అనెడు రెండురూపములు గలది. అందొక్కటియగు మలినసత్త్వప్రధానము పుట్టుకలేనిది. ఎఱుపు తెలుపు నలుపు వన్నెలు గలది. నానావిధరూపములతోఁ గూడిన బహువిధములైన ప్రాణులను పుట్టించునది, సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమై ఉత్పత్తిలేనిదగు పరబ్రహ్మము ఆ ప్రకృతియందు ప్రవేశించి మగ్నమై యుండును. అనుభవించి విడిచిన భోగములుగల యీప్రకృతిసంబంధము లేనివాఁడు ఉత్పత్తి శూన్యుఁడయి ప్రకృతికి విలక్షణుఁడైన పరబ్రహ్మస్వరూపుఁడై యుండుననుట.

"శ్రు. **న శిఖాం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజే ద్బుధః। బ్రహ్మసూత్రమిదం జ్ఞేయం సూత్రం నామ పరంపదమ్। తత్సూత్రం ధారయేద్యోగీ స విప్రో వేదపారగః**". తా॥ పండితుఁడయినవాఁడు శిఖాధారణము, ముండనము, లోనగు కర్మములను ముఖ్యములని యెన్నక, వెలుపలి యజ్ఞోపవీతధారణము వ్యర్థమని బ్రహ్మసూత్రధారణమే ముఖ్యమని, బ్రహ్మసూత్ర మనఁగా త్రిగుణవిభాగములవలననైన యిరువదియేడు భేదములు గల ద్వివిధప్రకృతికంటె పరమైన పరమపదమని ఆ సూత్రమును ధరించినవాఁడే **బ్రాహ్మణుఁడు, యోగి, వేదముల తుదముట్ట** నెఱిఁగినవాఁడని **యెఱుఁగవలయుననుట**. ఇట్లని బ్రహ్మోపనిషత్తునందుఁ గలదు.

మఱియు రజోగుణమువలనcగలిగిన మనుష్యులు లోనగు సకలజంగమ ప్రాణులలో రజస్సత్త్వసత్త్వగుణమువలనcబుట్టిన బ్రహ్మవాదులైన బ్రాహ్మణులకును, రజస్సత్త్వరజోగుణమువలన జనించిన క్షత్రియవైశ్యులకును, రజస్సత్త్వతమోగుణమువలన జన్మించిన శూద్రులకును, తక్కినజాతులలోcగలిగిన జనులకును ఆహారములును, దానములును, యజ్ఞములును తపస్సులును పూజలును శ్రద్ధలును సాత్త్వికరాజసతామస భేదములచేత మూcడు విధములుగ నుండును. అందు ఆయుర్వృద్ధిని శరీరశక్తిని ఆరోగ్యమును సుఖమును సప్తధాతువృద్ధిని జ్ఞానమును గలిగించు **తేనె పాలు నెయ్యి మినుములు గోధుమలు పెసలు** లోనగునవి **సాత్త్వికాహారము** లనcబడును. కామక్రోధాదులను ప్రబలcజేయు **కారము పులుపు ఉప్పు వేcడిమి చేcదు వగరు చుఱుకు**గల పదార్థములు **రాజసాహారములు** నాcబడును. జాములు గడచినది రసహీనమయినది దుర్గంధముగలది **చలిది ఎంగిలి అపవిత్రతగల పదార్థములు తామసాహారము** లగును. **దానములు॥** దేశకాలపాత్రముల నెఱిcగి యిచ్చుట సాత్త్వికదాన మగును. శాస్త్రోక్తక్రమముగc జేయు యజ్ఞములును, పూజలును, తపస్సులును సాత్త్వికము లనc బడును. డంభమునిమిత్తము మెప్పుదలలకు చేయు యజ్ఞములును, పూజలును తపస్సులును రాజసము లనcబడును. అశాస్త్రీయముగను, భయంకరముగను జేయు యజ్ఞములును, పూజలును, తపస్సులును తామసములగును. **శ్రద్ధావివరణము॥** ధర్మములును, కర్మములును నియతములని ఫలాపేక్షలేక యీశ్వరార్పణబుద్ధిచేతc జేయుట **సాత్త్వికశ్రద్ధ**. కాయక్లేశభయమున భక్తిలేక కర్మములను, ధర్మములను జేయుట **రాజసశ్రద్ధ**. మోహమువలన భక్తిలేక అశాస్త్రీయముగ కర్మములను, ధర్మములను జేయుట **తామసశ్రద్ధ** యనcబడును. ఇట్లు గీతాప్రమాణము. ఇవి యన్నియు చక్కcగ నెఱిcగి సకలజనుల గుణములను నిర్ణయించి బుద్ధిమంతులు సర్వవిషయములయందును మెలcకువ గలిగి మెలcగుచు ముక్తులు గావలయును.

**అవతారిక:–** ఈ శాస్త్రము నిర్విఘ్నముగ నెఱవేఱుటకొఱకు వల్లభాగణపతి సుత్తింపc బడుచున్నాcడు.

**శా॥ శ్రీమద్వామనిజోరువిష్టరమునం జెన్నొందు శ్రీవల్లభా**
**రామారత్నముc గౌcగిలించుకొని తారాజారప్రత్యగ్రరే**
**ఖాముక్తావళి మౌళిc దాల్చి విలసత్కాశ్మీరశోణాంగుcడై**
**ప్రేమ న్బొల్చు గణేశు నెంతు నతిగంభీరోక్తి నిష్టాప్తికిన్. 3**

**టీకా :–** శ్రీమ... రమనc, శ్రీమత్=శోభాయుక్తమైన, వామ=ఎడమదైన, నిజ=తనదైన, ఊరు=తొడయనెడు, విష్టరమునc=పీఠమందు, చెన్నొందు...రత్నముc, చెన్నొందు=



సొగసైన, శ్రీ=లక్ష్మీస్వరూపిణియైన, వల్లభా=వల్లభయనుపేరుగల, రామారత్నముc= కాంతామణిని, కౌcగిలించికొని=ఆలింగనముచేసికొని, తారా...వళిc, తారాజార=చంద్రుని యొక్క, ప్రత్యగ్ర=కొత్తయైన, రేఖా=కళయనెడు, ముక్తా=ముత్యముల యొక్క, ఆవళిc= సరమును, మౌళిc=కిరీటమందు, తాల్చి=ధరించి, విల...గుcడై, విలసత్=మిక్కిలి ప్రకాశించుచున్న, కాశ్మీర=కుంకుమపువ్వువలె, ని॥ **బాహ్లీకం పీతనం కాంతం పిశునం రుధిరాహ్వయం, కాశ్మీరం చ గుడం రక్తం తథా కాలేయకం చ తత్॥** అని ప్రతాప నిఘంటువు. శోణ=ఎఱ్ఱనైన, అంగుcడై=శరీరముగలవాcడై, పొల్చు గణేశుc, పొల్చు=వెలుc గుచున్న, గణ=ప్రమథవీరనరసురరద్రపితృ ఋషి దైత్యరాక్షసభూత పిశాచవిశ్వేదేవవసుతుషిత భాస్వరానిల మహారాజికసాధ్యాదిసకల గణములకును, ఈశుc=ప్రభువైన వల్లభాగణపతిని, ఇష్టాప్తికిc=ఇష్టసిద్ధికొఱకు, అతిగంభీరోక్తిc, అతి=మిక్కిలి, గంభీర=తెలియనలవిగాని, ఉక్తిc=పరావాక్కుచేత, ప్రేమc=ప్రీతితోడ, ఎంతుc=కొనియాడుచున్నాcడను.

**తాత్పర్యము :–** సొగసగు తనయెడమతొడ యనియెడు పీఠముమీcద కూర్చుండి యుండెడి వల్లభయను పేరుగల తనప్రియవల్లభను కౌcగిలించికొని బాలచంద్రుని కిరీటమున ధరించి కుంకుమపువ్వువలె నెఱ్ఱని యొడలుగలిగి ప్రకాశించుచుండెడి వల్లభాగణపతిని నామనోరథము నెఱవేఱుటకొఱకు మిక్కిలి మక్కువతో పొగడుచున్నానని తాత్పర్యము.

మఱియు లోకమున గణపతి బ్రహ్మచారియని వాడుక యుండcగా నీగ్రంథమున గృహస్థునిగ స్తుతించుట యెట్లనిన దుర్వాసుcడు శ్రీపురమును వర్ణించినపుడు చెప్పిన ఆర్యాద్విశతియందు శ్లో॥ **వందే గజేంద్రవదనం వామాంకారూఢవల్లభాశ్లిష్టం, కుంకుమ పరాగశోణం కువలయినీజారకోరకాపీడం** అని, మఱియు దశభుజమహాగణపతి మంత్రధ్యానమున శ్లో॥ **హస్తీంద్రాననమిందుచూడమరుణచ్ఛాయం త్రినేత్రం రసాదాశ్లిష్టం ప్రియయా సపద్మకరయా స్వాంకస్థయా సంతతమ్। బీజాపూరగదాధనుర్వి శిఖయు క్చక్రాబ్జపాశోత్పల। వ్రీహ్యగ్రస్వవిషాణరత్నకలశాన్ హస్తైర్వహంతం భజే॥** అనియు చెప్పc బడియున్నది. వెండియు శివునకు నిరువదియైదు లీలలును శక్తికనంతరూపములును, విష్ణువునకు దశావతారములును గలయట్లు గణపతికిని ఇరువదియొక్క లీలలు గలవని గణపతిపురాణ కల్పములు ప్రసిద్ధముగ ఘోషించుచున్నవి. గ్రంథవిస్తరభీతిచేత నవి యిచ్చుట వ్రాయcబడవు.

**అవతారిక:–** శ్రీమదద్వైతమతభాష్యకారులును, పరమహంసపరివ్రాజ– కాచార్యులును అగు శ్రీశంకరాచార్యులు వినుతింపcబడుచున్నారు.

**మ. అజసంస్తోత్ర మెఱింగి పంప హరి మున్ వ్యాసాఖ్యసూత్రాదులన్**
**సృజియింపం గొని వాని దుర్మతములన్ శిక్షించి శ్రీభాష్యముల్**

